సత్య ధర్మ శాంతి ప్రేమముల ద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధి కల్పితము

సంపుటము 15 ఫిబ్రవరి సంచిక 13

—:చిత్రములు:—

సైనికుల మహాసభ

శ్రీవారి సన్నిధిన బెంగుళూరు బాలలు



—:శ్రీ వారి కార్యక్రమములు:—

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొనగోరు భక్తులు ఎడిటర్. సనాతన సారథి. ప్రశాంతినిలయము పోష్టు. పెనుకొండతాలూకా అనంతపురం జిల్లా. అనే విలాసమునకు రిప్లయికార్డుగాని రిప్లయిపెయిడ్ టెలిగ్రాంగాని పంపితే కొత్తచెఱువు 30 PCO ఫోన్‌చేసితే తెలుపగలము.

చందాదారులకు విజ్ఞప్తి

TC 9688 నుండి TC 9987 వరకు

మీ రసీదు కార్డులోను ఈ పత్రికలోని మీ విలాసపు కాగితమూలోనూ మీ చందా గడుపు ఏ సం॥ ఏ నెలవరకు, అని తెలుపే నంబర్లున్నవి, గమనించండి. ఏప్రియల్ 73 సంచిక నుండి మీరు క్రొత్త చందాలు కట్టవలసి యున్నచో (ఇదివరకు పంపనియెడల) మార్చి 9 తేదీ లోపల, (సం॥ రూ 4) కార్యాలయము చేరునట్లు పంపవలెను



మహాశివరాత్రి మహోత్సవము

# భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయిబాబా వారి

దివ్య సన్నిధిన

మార్చి 8 వ తేదీ, శనివారము

## ప్రశాంతినిలయమందు

మహా వైభవో పేతముగ

జరుపబడును



# రామకథా రస వాహిని

శ్రీసత్యసాయిబాబా

## 37

### వనవాస కష్టములు

సీతా! కటికినేలను బవ్వళించి, నారవస్త్రములను గట్టి; కందమూలఫలములను భుజించవలెను. అవి యైననూ ప్రతిదినము దొరుకుట దుర్లభము. ఋతుధర్మము ననుసరించి అవి దొరుకుచుండును. కోటి కపటవేషములు ధరించి మనుజులనే భక్షించు రాక్షసులు, అరణ్యము లందు మెండుగా నుందురు.

వనవాసకష్టముల జెప్పుటకు శక్యముకాదు; నీవు వనవాసమునకు తగవు. నీవు నాతో వనవాసమునకు వచ్చిన యెడల లోకులు నన్ను అతినీచముగా దూషింతురు. మానస సరోవరములోని అమృతోపమానమగు నిర్మలజలమును త్రాగి జీవించు హంస, లవణ సముద్రములోని నీరును ద్రాగి యెట్లు జీవింపగలదు? నూతనముగా చిగిరించిన తియ్యమామిడితోటలో విహరించు కోకిల, తుమ్మతోటలో యెట్లు విహరించును? ఈ సంగతులు విచారించి నీవు గృహములో నుండుట పరమోత్తమము

ఈ విధముగ మృధుమధురముగ శ్రీరాముడు పలికిన పలుకులనువిని జానకి కన్నీరు గార్చుచూ నేలను చూచుచూ స్తంభించిపోయెను ఆమె కంటిధారలు ధారలవలె నేలపడుచుండగా, రాముడు చూడలేకపోయెను నాడు ప్రత్యుత్తరమిచ్చుటకు ఆమె కేమియు తోచక పోయెను. శకి నీరసించెను. కడకెట్టులో ధరించుకొని, దుఃఖమును మ్రింగి

సతికి పతియేగతి

ఓ ప్రాణనాధా! మీరు కరుణా సముద్రులు. సకల సుఖములకు నిధులు; మిమ్ములనెడబాసి యుండినపుడు స్వర్గమయినను నాకు నరకముతో సమానము. తల్లిదండ్రుు

లును, సోదరులును, సోదరీమణులును, అత్తమామ లును, సుతులును, గురువులును, బంధువులును వీరం దఱూ సకలగుణ సంపన్నులయిననూ—సతికి సుఖము నిచ్చువాడు పతియే; పతితప్ప అన్యగతి వుండదు,

నాథా! తనువును ధనమును గృహమను పుర మును రాజ్యమును ఇవి పతిదూరమైన సతికి దుఃఖము నే ఇచ్చునుగానీ ఆనందమును అందించలేవు. పతిలేని భోగములు రోగమునుబోలినవే; నా సర్వసుఖములు మీ వద్దగలవు. శరత్కాల చంద్రబింబమువంటి మీ ముఖార విందమును చూచుచుండుటయే నాకు సర్వసుఖము.

నేను మీతో నుండినపుడు ఖగమృగములే నాబంధు వులు; వనమే పట్టణము; వల్కలములే పట్టుపీతాంబర ములు; పర్ణశాలనే సురసదనము; సౌందర్యభవనము. వనదేవతలే నా అత్తమామలు. మీతోనుండినపుడు కుశ పల్లవములు మన్మథుని సెజ్జవలె మెత్తగానుండి సుఖము నిచ్చును. కందమూలఫలములు అమృతోపమానముగ నుండును. పర్వతములు అయోధ్యలోని మేడలతో సమా నము. పర్వతముల దిగుడు పైనుండి క్రిందిమేడకు దిగునటుల నేను అవలీలగ దిగగలను. నిత్యము మీ పాదారవిందములను దర్శించి సంతోషించుచుం దును

బాధించుట తగదు

అంతియేకాదు! తమకు సర్వసేవలూ నే నే చేయుటకు ఇది మంచి అవకాశము. ఇట్టి సు సమయమును నేను దూరము చేసుకొని యెట్లుండగలను? ఓ కృపానిధి! నన్ను తీసుకొని వెళ్ళుటకు సర్వాంతర్యాములైన మీకు నేనింత వివరించి చెప్పనవసరము లేదు. నా హృదయమును యెరిగిన మీరు నన్ను ఇట్లు బాధించుట తగదు.

నాథా! నేను దీనురాలను నన్ను విడచి వెళ్ళిన మీ నామమునకు లోపమువచ్చును. మీరు సకల గుణ సంపన్నులు. నా మీద దయ తప్పుట యుచితమా?

పదునాలుగు సంవత్సరములు మిమ్ము విడచి జీవించగలనా? పదినిమిషములు కూడను నే జీవించజాలను కరుణించి కనికరముతో అంగీకరించుచు

నాథా! నేను మీచెంతనుండిన నన్నెవరునూ మింగలేరు. అసలు నన్ను చూడలేరు! నక్కా కుందేలు వంటి చిన్న మృగములు కన్నుతెరచి సింహమును చూడగలవా? నేను సుకుమారిని కాదు. మీరే సుకుమారులు. మీరే వనవాసమునకు అర్హులుకారు. భూమి నాతల్లి అగుటన్ చేత, భూమిపై సంచరించుట నాకు తగిన అధికారము

కలదు. నిజముగా సుఖించుట మీ వంతు; శ్రమపడుట నావంతు. అట్టి దానిని మీరు విరుద్ధముగా భావించి, బాధించుట న్యాయము కాదు.

తగిన బలము గలదు

మిరు చేయలేని కఠిన పనులైననూ నేను అవలీలగా చేతును. యే రాజులునూ యెత్తలేని శివధనుస్సును నేను అవలీలగా యెత్తిన సంగతి మీకు బాగా తెలిసియూ, నా బలమును సంశయించుట ఆశ్చర్యము! మీ కెంత శక్తి సామర్థ్యములు కలవో వాటికి నా శక్తి సామర్థ్యములు తిసిపోవు.

కాన కాలహరణపు మాటలను ఆడక నాకనుజ్ఞ దయచేసి ముందుకు జరుగవలసిన యేర్పాట్లు ఆనందముగా జరుపుడు— అని వంగినమస్కరించిన సీతనుచూచి.

వెంట గొనిపోదును

రాముడు ఇక ఆమెను నిరోధించుడమంచిది కాదని దృఢనిశ్చయము చేసుకొని; "సీతా ! విచారింపకుము. నీయిష్టప్రకారము, నా వెంటగొనిపోదును. విచారించుటకు సమయముకాదు, వనమునకుబోవుటకు తగినప్రయత్నము శీఘ్రముగ చేయుము"

అని ప్రియవచనములను పలికిన రామచంద్రుని మృదువచనములనువిని, అంతులేని ఆనందముతో; గంతులువేసి సీత "నాథా! వనవాసమునకు ప్రయత్నము లేమున్నవి? నా సర్వాభరణములు సమస్త అనుకూలములు నిరంతరము సంసిద్ధమే! నా పెన్నిధి. మీరుతప్ప అన్యరూపములను ఆశించనన్న సంగతి మీకు తెలియును. ఈ క్షణమునసే మీ వెంట బయలుదేరుచున్నాను"

అని రామచంద్రుని చేయిపట్టుకొని ముందుకు నడుచుటకు పూనుకొనెను, అంత రామచంద్రుడు యోచించి సీతా! పదునాలుగుసంవత్సరములు మనము అయోధ్యలో వుడంము కనుక నీ ప్రీతికై గురియైన, చిలుకలు రకరకమైన పక్షులు. నీ వియోగముతో పంజరములందె ప్రాణములు విడువవచ్చునుకాన వాటిని. బంధనలనుండి విడచిపెట్టుము. మిగిలిన గోవులను బ్రాహ్మణులకు దానముచేసి నిత్యజీవితమునకు ఉపయోగించుచుండిన వస్తువాహనాదులు. బీదసాదలకప్పజెప్పుట మంచిది. లేకున్న పాడయిపోవును; అట్లు పాడవుట కంటె, పరులకు అందించి వారికి అనుకూలపరచుట మంచిది కదా"

బయలు దేరుటలో ఆనందము

అని సలహా అందించిన తక్షణమే సీత. పంజర

ములచెంతకువెళ్లి. వకొక్కపక్షినీ ప్రీతిరీతిగా పలుక రించి. మీరును మావలే సహజారణ్యముల స్వేచ్ఛా విహారము సల్పుడు, అని తనహస్తములతో వాటి బంధ ములను విడిపించెను. ఇక గోవులను, తిండి పదార్థము లను, నానా విధములైన ఫలహారములను క్షణములో పంచి పెట్టెను.

ఆ సీతాజనని వికసించిన వదనముతో, మృదుమధుర వచనములతో బ్రాహ్మణులను పలుకరించుచూ, గోవు లను అందించుచుండ చూచువారల హృదయములు కరిగి నవి. కంటి ధారలు వరదలుగా ప్రవహించినవి. ఆమె త్యాగము. ఔదార్యము. వనవాసములకు పతితో బయలు దెరుటలోవున్న ఆనందమునూ, యెట్టికవియైననూ వర్ణించ జాలకపోయిరి.

ప్రజల విచారము

ఇంతలో తల్లిఆనతి తీసుకొనివచ్చిన లక్ష్మణునికలసి. సీతారామలక్ష్మణులు రాజమందిరమునకు వెళ్ళుచుండుట వీధులలోని ప్రజలు చూడలేకపోయినారు. ప్రజల శరీర ములు వాడిన మొక్కలవలే వ్రాలదొడగెను. ప్రజల మన సులు దుఃఖముచే వ్యాకులమయ్యెను.

తేనెను పోగొట్టుకొనిన; తుమ్మెదలవలె ప్రజలు దీను

త్తైరి. చేతులను నలుపుకొనుచు. శిరస్సులను మోదుకొనుచు రెక్కలుతేని పక్షులవలె విలపించిరి. వేలజనులు రాజ హజారములో నిలచియుండిరి. వారల విచారమును వర్ణింప శక్యముకానిదై పోయెను.

పొంగి పొరలు దుఃఖము

ఇంతలో మంత్రిలోనికివెళ్లి స్పృహతప్పి పడియుండిన రాజును లేవదీసి కూర్చుండబెట్టెను. సీతారామలక్ష్మణులు తమదర్శననిమిత్తమై వచ్చుచున్నారని తెలిపెను. ఇంతలో రామచంద్రుడు ప్రియ వచనములు పలుకుచూ తండ్రిని సమీపించెను. జానకిని లక్ష్మణుని చూచి దశరథుడు అమితముగా దుఃఖించెను. రామచంద్రుని కౌగిలించుకొని పరవశుడై నేలపడెను. పొంగి పొరలు దుఃఖముచె మాట లాడని స్థితిలో యెదను బాదుకొనుచున్న దశరథుని అవస్థను సీతా లక్ష్మణులు, చూడలేక పోయినారు లక్ష్మణుడు చెంతనే నిల్చొని రీవిగా చూచుచున్న కైకను క్షణములో ప్రాణము తీయునటుల కండ్లెఱ్ఱచేసి ఉగ్రుడై చూచుచూ, తిరిగి కోపమును చల్లార్చుకొనుచూ రామచంద్రుని శాంత వదనమును దర్శించుచుండెను.

బయలుదేరుట మంచిది

ఇంతలో కైక, రామా! నీవు మీ తండ్రిని మరింత

దుఃఖమునకు గురిచేయుచున్నావు. యెంత త్వరగా నీవు బయలుదేరి అరణ్యముచేరిన, మీ తండ్రి అంత త్వరలో శాంతిని అందుకొనిగలడు కాని, ఆలస్యముచేయక తండ్రికి నమస్కరించి బయలుదేరుట మంచిదని నిర్దాక్షిణ్యముగా పలికిన తలుకులు దశరథుని కుండలను బ్రద్దలు చేసి నట్లయినవి.

ఆ మాట వినగనే "రాక్షసీ! యెంత కఠిన వాక్కులాడుచున్నావే," అని మూర్ఛనొందెను. ఆ సమయమును చూచుకొని సీతా రామలక్ష్మణులు, తండ్రి పాదములకు నమస్కరించి, "హే పితాజీ! మమ్ములను దీవించి సెలవు దయచేయుడు? అనిరి. "తమరు విస్మయమును పొందుట" మంచిది కాదు; ఇది సంతోషమునకు సమయము. అతి మోహము అపకర్తికి మార్గము".

అని తండ్రిని మోహము విడువమని పాదములు గట్టిగా పట్టి మోకుళ్లపై కూర్చున్న రాముని, కన్నులు తెరచి చూచి, దశరథుడు ప్రయాసతో లేచికూర్చొని రాముని చేతులు పట్టుకొని, నా బంగారు బిడ్డా! నా మాటవినుము నీవు నియతాత్ముడవు, ఉచితకార్యములు చేయుట నీకు తగును. అపరాధము చేసినవాడొకడై, దాని ఫలము అనుభవించువాడు మరొకడని చెప్పుట యుచితము కాదు.

విధికృతములు, విచిత్రములు. వానిని తెలుసుకొను వారెవరు?

అని రాముని ప్రయాణమును తప్పించుటకు, రాజు నిష్కపటముగా అనేక విధములు తెలుపుచూ వచ్చెను.

( సశేషము )

పరమ బాంధవుండు - పర్తిపురీశుండు
భవభయంబునణచు - దేవు డతడు .
నమ్మియుండు వారి - నయమున బ్రోచును
వాని పాదయుగము - భక్తిగొల్చు.

జాతి మతములన్ని - సమమతవికి గాదె
భేదమేము లేదు - ప్రేమ జూచు
దైవ మొక్కడేను - తగనెంచి చూడంగ
నన్ని దైవములను - తానె గాదె !

సకల జీవరాశి - తనలోనె యున్నవి
తాను జీవులందు - తగ వసించు
ప్రకృతి యంత నిండి - బ్రహ్మ స్వరూపుడై
ప్రజ్వలించు వానికి - వందనములు.

అబ్బూరి సూర్యనారా

# సంఘదర్పణములో ఈశ్వరప్రతిబింబము

పవిత్ర ఆత్మ స్వరూపులైన బాల బాలికలారా: సభ్యులారా! ఈనాడు మీరు జరుపుకొనుచున్న బాల వికాస్, మరియు మహిళా మండలి వార్షికోత్సవం అత్యంత ఆనందము. సాయి ఈ నాడు సాకారంగా మీ మధ్య లేడని తలంచకుడు. మీ యందే యుండి మీరు అనుభవించు ఆనందమును తాను ఆరగించుచున్నాడు. ఆనందమునే ఆహారముగా అనుభవించునది ఆత్మ. ఆత్మలేని ఆకారము ఆనందముకాని ఉండజాలదు. కాన సాయి సాకార ముతోనే మీ సంతోషమును అనుభవించుచున్నాడన్న సత్యమును నిరూపించవలసిన బాధ్యత ఈ సమావేశమున మీ పై నున్నది.

అవతారపురుషుల దివ్య జన్మ దివ్య కర్మలే దివ్యమానవు లకు మార్గదర్శకంగా, ప్రమాణంగా వుండాలి అప్పుడే అవతార తత్వం మానవులలో అవతరించును. జగత్తు దివ్యంగా వుండిన పుడే ప్రాణుల జీవితాలు కూడాను దివ్యంగా వుంటాయి. అందు కోసము దైవమే తాను సర్వదా సృష్టిలో అవతరించుచుండును. దివ్యానుభూతి దివ్యస్థాయి కేవలం మానవాతీతం కాదని అది మానవులకు సిద్ధిస్తుందనే, అవతారతత్వపు రహస్యం; మానవు లకు వర్తించే రహస్యం. తన సృష్టిలో కూడను తన దివ్యత్వం ప్రతిబింబించును. లేకున్న అది ఈశ్వర సృష్టియేకాదు. కాబట్టి కర్మను ఈశ్వర పరమై ప్రకృతి కర్మగా పరిగణించాలి. మాన వుడు కర్మను తన కర్మగా భ్రమించరాదు. కర్మలో అకర్మను

అకర్మలో కర్మను, చూచుటే బుద్ధిమంతుని లక్షణమై యుండాలి. పేరులలో మార్పువున్నను ప్రస్తుత మన నివసించి చైతన్యము, మామూలు గుణవర్ణలరీతినే అభివ్యక్త మవుతూ వుంటుంది. ప్రకృతి గుణములైన సత్వ రజస్సు తమస్సుల చైతన్యమే నేడు మనకు యెక్కడైనా కన్పించేది. ఇది సృష్టి ప్రక్రియకు తగిన వాస్తవ విషయము.

సృష్టి అనగా ఈశ్వరునకు ప్రకృతి అర్పించుచున్న మహా యజ్ఞము. కర్మద్వారా జన్మించిన వారికి కర్మను వదలుట అనునది నీళ్ళను వదలి పడవ ప్రయాణం చేయాలని అనుకొనుట వంటిది. శరీర యాత్రకైనా కర్మ అవసరం. తన కర్మఫలితాలకు తానే బాధ్యులమనే భ్రాంతి, సాధకునికి వుంటుంది ; అదిపోవాలి

భక్తునియొక్క స్వంత శ్రేయోభిలాషిగా మాత్రమే కాదు ఈశ్వరుడు కనపడుట ; సకల ప్రాణుల యేకైక [illegible]త్రునిగా, సకల ప్రకృతి చైతన్యాన్ని స్వీకరించే భోక్తగా. ప్రభువుగా, వుంటాడు; అవుతాడు; సర్వలోక మహేశ్వరుడనే పేరుతో పాటు "సుహృత్ సర్వభూతాని" అని కూడా చెప్పుకోవటంతో ప్రభుత్వంతోపాటు ప్రేమ తత్వాన్ని, స్నేహతత్వాన్ని కూడా ద్యోతకం చేస్తుంది.

దివ్య ప్రేమయే మానవ ప్రేమాది [illegible] [illegible]. సంఘం యేమైతే మాత్రము? అన్ని వారికంటె శిల్ప[illegible] [illegible] దిన మైన కారిన్యమును నిర్లిప్తతను ప్రదర్శించుటకు [illegible]. అది ఆధ్యాత్మికము కానేరదు. సంఘదర్పణములో ఈశ్వర ప్రతిబిం

బాన్ని సుందరంగా శుభంగా చూడగలరు; చూడాలి.

సర్వత్రా కర్మవాహినిగా ప్రవహించేది, సచ్చిదానందమే. గుణ ప్రేరిత అహంభావ ఫలితంగా, సచ్చిదానందపు పూర్వ తత్త్వము ఏకత్వము, మనస్సుచే చీల్చబడుతుంది. అందుమూలముగా రాగద్వేషాలు, సుఖదుఃఖాలు, సచ్చిదానందపు వికృతాలుగా కనబడతాయి.

వ్యక్తి అనే జలాశయాన్ని ఏకరీతిని, కర్మవాహిని నింపి సమాజమనే సముద్రములో కలుస్తూవుంటుంది. దివ్యమానవ సమాజములో సచ్చిదానందము మాత్రమే మనో వాక్ కాయ కర్మణా స్వచ్ఛందంగా అభివ్యక్తమవుతుంది.

త్రిగుణాత్మకమగు మనస్సును, ప్రకృతిని, శరీరము బంధించరాదు. వాటిని దైవస్థాయికి వుద్దరించుకొంటే అదే బంధువగును; లేకపోయిన, అదే శత్రువగును.

త్రిగుణాలభావాలవలన యావత్తుజగత్తు ఘోషించును. యెవరు దైవాన్ని ఆశ్రయింతురో వారిని ఈ ఘోషయేమీచేయ జాలదు. ప్రాణం అనేది తత్వతః అమరం; శరీరం, దాని పాంచభౌతిక రూపం.

ఈ రూపము నశించినంత మాత్రమున ప్రాణం నశించదు. దివ్య మానవునిలో ప్రాణం తన అమరత్వపు స్పృహలతో ప్రవర్తిస్తుంది.

అక్షరమే పరబ్రహ్మం, స్వభావము ఆధ్యాత్మము; ప్రాణులను, వాటిస్థితిగతులను రూపొందించేది విసర్గ. దీనినే సంజ్ఞకర్మ అంటారు.

ప్రకృతిద్వారా లభించే భోగభాగ్యాలను యెలాగో సమానంగానో అసమానంగానో పంచుకుందామనే కామ ప్రవృత్తి సామాజిక జీవితానికి ప్రాతిపాదిక కాకూడదు. భోగభాగ్యాల దృష్టివలననే అనాదినుండి సమాజం దివ్యస్థాయిని చేరలేక పోవుచున్నది.

సచ్చిదానంద తత్త్వాన్ని మూర్తీభవింపకొందామనే ఆధ్యాత్మిక ధర్మమే, సామాజిక జీవితానికి ప్రాతిపాదికగా వుండాలి స్వకుటుంబముపై రక్తసంబంధముపై ఆధారపడిన బంధుత్వాన్నిమించిన ఆధ్యాత్మిక బంధుత్వాన్ని గుర్తించాలి. అదియే దివ్యబంధుత్వమునకు పవిత్రసూత్రమై ఈశ్వర ధర్మానికి అనుగుణంగా ప్రవర్తించాలి

పవిత్రాత్మ స్వరూపులారా ! సాయి సంస్థలు సమచిత్తములుగా వుండాలి. అప్పుడే సంఘ చిక్కులను తీర్చి, దిద్ది, సాయిచిత్తమునకు హత్తుకొందురు. వుత్తమాటలతో రిక్త చేతులతో పెత్తమందలి విషయములను రక్తి కలుగునట్లు భక్తిని ప్రబోధించుటచే ప్రయోజన ముండదు. శక్తి సంపనలేప, అనురక్తితో ఆర్తుల బాధలను గుర్తించి వర్తించి, ముక్తిమార్గమునకు రక్తిని పుట్టించుటకు తగిన ఆచరణలు, మనసభ్యుల హస్తమందుండవలెను. అట్టివే గట్టిచేతులు, లేకున్న మట్టిచేతులే.

ఇట్లు

మీ హృదయవాసి సాయి, హాయి, తాయి, పాయి,

పెద్దాపురం భక్తసమాజమునకు శ్రీవారి దివ్య సందేశము



# విశేష సమారంభము



జనవరి 5 వ తేదీ శుక్రవారము, బెంగుళూరు నగరమందున్న భారతీయ సేనా క్షేత్రమందు, చిరస్మరణీయమైన ఒక విశేష సమారంభము జరిగినది. 'ఆర్మీ సర్వీస్ కోర్' అనే సేనా విభాగ ముయొక్క అధికారులు, తమ క్యాంపస్ ప్రదేశమునకు శ్రీ వారిని రప్పించి యోధులనూ వారి కుటుంబ పరివారము లనూ ఆశీర్వదించవలెనను కోరిరి. శ్రీవారు వారి పిలుపును కృపతో అంగీకరించిరి. ఎ. ఎస్, సి ముఖ్యాధికారి లె॥ క॥ హండాగారు పుష్పమాలాలంకృత జీపు వాహనములో శ్రీవారిని ఊరే గింపుతో క్యాంపసుకు తీసుకొని పోయిరి. రోడ్ల ఇరు ప్రక్కలలోనూ యోధులు వరుసగా నిలచి జై జైలు మ్రోగుచుండగా షుమారు 2 మైళ్ళ దూరము వెళ్లిన తరువాత. శ్రీవారు అక్కడ అమితోత్సా హముతో క్రిక్కిరిసి, క్రమశిక్షణతో చేరిన బ్రహ్మాండమైన సభనుద్దేశించి తమ దివ్యబోధ నందించిరి

అంతశ్శత్రువులపై దాడి జేసి, వారిని ఓడించి, జయభేరి మ్రోగించిన యోధులు, బాహ్య శత్రువులను క్షణమాత్రములోనే పరాజితులు గావించుటకు సమర్థులగుదురని బోధించిరి. కామక్రోధ ములను అరికట్టువారే ధీరులు, శూరులు, క్రమశిక్షణ శ్రద్ధాభక్తులు, సేవా బుద్ధి -వీటిని అభివృద్ధి చేసుకొని తద్వారా దేశకల్యాణమునకు సైనికులు తోడ్పడవలెనని నొక్కిచెప్పిరి. రెండు వేలకు పైగా అక్కడ సమావేశమై శ్రీవారి దర్శన భాగ్యమును వారి ఉపన్యాస శ్రవణ భాగ్యమునూ, అందుకొనిరి.

# శ్రీవారి కృపా ప్రభావము

"బాబావారు అంధకారమయ జీవితములలో దివ్యకాంతులను వెలిగించిరి. బాబావారి దివ్యనామమును ఉచ్చరించుట పుణ్యాత్ముల పంటే. సత్సంగములలోజేరి భజనలు చేయుట అవ్యయానంద మునందుకొనుటే అని న్యూయార్కులోని సిస్టమ్స్ రిసెర్చి యింటర్నేషనల్ ప్రొఫెసరు బి. ఎస్. శర్మగారు వ్రాసిరి. రెండేండ్లనుండి 50 ఈస్టు 42వ వీధిలో పక్షమునకొకతూరి భజనలు ప్రార్థనలు ధ్యానము జరుపబడుచున్నవి. అందుకై దూరముగా యున్న లాంగ్ ఐలండ్ న్యూజెర్సినుండికూడ జనము అక్కడ చేరుచుండిరి. ఆ మనోరంజకమైన సత్సంగముకొరకు ఎముకలు కొరుకు చలిగాయున్ననూ కుండపోతగా వర్షము కురియుచున్నను చాలమంది జమ అగుచుండిరి.

865 వెస్టు ఎండ్ అవెన్యూలో కుమారి హిల్డా చార్లెటన్ ప్రతిగురువారమూ జరుపించు ప్రార్థన ధ్యానసభలకు మున్నూరుమంది హాజరగుదురు; వారిలోకొందరు నీగ్రోలు, స్పెయిన్‌దేశస్థులు; చాలమంది అమెరికావారే. ఆ భజనలద్వారా బాబావారి ఆశీస్సులను హిల్డాగారు అందరికీ అందించుచున్నారు. యువకులకు ఆమె మార్గదర్శనం చాలా ఉపయోగకరముగా నున్నది.

సర్వమతములూ ఏకం సత్ అనే మౌలికసత్యాన్నే ప్రబో ధించునవి తెలియపరచు బాబావారి ఎంబ్లెమ్‌ను, న్యూయార్కు నగర ములోని హిందూదేవాలయ సంఘం వారు అంగీకరించి, గోడమీద అట్టి యెంబ్లెమ్‌ను చిత్రించి దానిక్రిందభాగములో వినాయకవిగ్రహ మును ప్రతిష్ఠించిరి. సుందరమైన హిందూదేవాలయపు హాలులో 25 నవంబరున బాబావారి భక్తులు అవతారపురుషుని జన్మదినోత్సవ మును మహావైభవముగా జరిపిరి. కుమారి హిల్డా చార్లెటన్ ఉపన్యసించెను. దేవాలయపు కార్యక్రమమును చలనచిత్రముతీసి నప్పుడు "సుబ్రహ్మణ్యం సుబ్రహ్మణ్యం" అను భజన అందరినీ పులకరింపజేసినది.

బాబావారి భక్తుడు, గుజరాత్ రాష్ట్రమునకు చెందినస్వామి జగదీశ్వరానందుడు న్యూయార్కునగరములో గీతాదేవాలయములో గీతామహాయజ్ఞమును జరిపించెను.

న్యూయార్కులోని 86వ స్ట్రీటులో పేవ్‌మెంటు బెంచిమీద పద్మాసనం వేసుకొని కూర్చున్న ఒక అమెరికాదేశస్థుడు జనప్రియ బోధకుడుగా చలామణి అగుచున్నాడు.

శ్రీవారే ఆయనను అక్కడకు పంపినట్లు ఆయనచెప్పు తాడు: ఆయన విచిత్రజీవి. మటుక్కుమాట్లాడడు తనభావాలను సౌజ్ఞలతో తెలియపరుస్తాడు. ఆ సౌజ్ఞలర్థము చెప్పువాడొక డున్నాడు ఆ బాబాభక్తుని పేరు "యావక్కైపు" సౌంజ్ఞలకర్థము చెప్పువాని పేరు "ఆవక్కడు" అట, అంతా వింతే: బాబావారు

వీరిరువురిని సాధనములుగా మార్చుచున్నారు? యీ వక్కడు అనేకమంది నాగరికులను శ్రీవారి ప్రేమ భక్తిమార్గములో ప్రవేశ పెట్టుచున్నాడు. ధనమున కాశించుచూ నేడు ధ్యానము నేర్పువారు సర్వత్రా తిరుగాడుచుండగా యీవక్కడు ఆధ్యాత్మిక రహస్యముల నార్తులకందించి దక్షిణరూపముగా తృణమైనా పుచ్చుకోడు; వాక్కు యున్నప్పటికీ భగవత్సందేశమును మౌనముతో ప్రచారము చేయుచున్నాడు యీవింత గురువు "అని సుప్రసిద్ధజనప్రియ దైనందిన పత్రిక అయిన NEW YORK POST ఆయనను గురించి ఒక లేఖలో ప్రచురించినది.

"గాసు, దుమ్ము ధూళి, ధూమములతో కలుషితమైన వాతావరణముగల ఈ నగరములో; నేరం అనుమానం, అవిశ్వాసములతో మానవుల మనస్సులు కలుషితములై నగరవాసులు భయభ్రాంతులతో కాలముగడుపుచున్నను మేము సత్సంగము; లలో బాబావారి దివ్యసమక్షమును అనుభవించి ధైర్య సంతోష ములను సుఖశాంతులను అందుకొని ఆనందించుచున్నాము. బాబావారి అపారకరుణను మాపై ప్రసరింపచేసి సన్మార్గములో మేము ఉండునట్లు భగవాన్ బాబావారు మమ్మల్ని అనుగ్రహించటం వల్ల మేమెంత అదృష్టవంతులమో తెలియుచున్నది" అని ప్రొఫెసర్ శర్మగారు వ్రాస్తున్నారు.

(సం)



# ఇమిటేషన్లు

బుద్ధగయలో బోధివృక్షముక్రింద కూర్చొని తపధ్యానముల నాచరించి సిద్ధార్థుడు పరిపక్వస్థితిని పొందినపుడు, కొంతమంది అక్కడచేరి చాలానీచముగా బుద్ధుణ్ణి దూషించినారు. దాన్నిచూచి కోపోద్రిక్తులైన అనుచరులు శిష్యులూ; "స్వామి! మాకు శెలవీయండి వీరికి చక్కని గుణపాఠము చెప్పుతాము. దండం దశ గుణం భవేత్. వీళ్లవీపులు పగిలితేగాని వీళ్లకు బుద్ధిరాదు" అని అడుగగా, బుద్ధుడు "నాయనా! నన్ను దూషించి వారు యెంత ఆనందపడుచున్నారు? చూడండి! మీరు భూషించి ఆనందము పొందితే, వారు దూషించి సంతృప్తిని సంపాదించుచున్నారు. వారివలన నాకేమీబాధలేదు; మీరు మీ కోపమును అరికట్టుకొని శాంతముగా మెలగవలెను. అద్వేష్టా సర్వ భూతానాం — ఇదే మానవుని సహజ చర్యగానుండవలెను. ఇదే భారతీయ మహనీయుల ఆదర్శము" అన్నాడు.

ఓర్వలేనివాళ్ళు అసూయవలన; తనకంటేగొప్ప అనే కక్షపట్టి ద్వేషమును పెంచటమువలన, రాక్షసహృదయులు దూషించవచ్చును. లేక; కోరినది ఫలించక ఆత్మపరీక్షసలుపక నిరాశతో సహనమును పోగొట్టుకొని దూషించవచ్చును. ఇట్టి వాళ్ళు అల్ప బుద్ధులు; హీనమార్గముల నవలంబించువాళ్ళు వాళ్లతో

వ్యవహరించి సంబంధము కల్పించుకొన్న మీకే చాలా మాలిన్యము కలుగును. నిజముగా సామాన్య మానవులు అపవిత్ర మార్గమందు అడుగుపెట్టరు; కాబట్టి దూషణ మార్గములో ఏగే ఈ అల్పబుద్ధులు సామాన్య మానవులకంటే హీనులనే చెప్పవలసియున్నది.

మీరు అనవచ్చును; స్వామి! మేము సామాన్యులు; మేము పూజించేరూపములను దూషించిన, దాన్ని యెట్లు సహించేది? — దీనికి ఒక చిన్నఉదాహరణ: మీకు ఒక రిజిష్టర్డ్ లెటర్ వచ్చిన దానిని మీరు సిగ్నేచర్‌చేసి తీసికొన్న దానిలో విషయములు మీకు చెందును, వాటివలన మీ మనస్సునకు ఆందోళన కలుగును; అయితే; దానిని మీరు తీసుకొనకపోతే అది రి-డైరెక్ట్ పంపిన వాళ్ళకే వాపస్ పోవును. దూషణకూడ అంతే. నన్ను తిట్టాడే అని మీరు దానిని స్వీకరించిన ఆ తిట్టంతా మీపైనే వచ్చిపడును! నాకు కాదు నాకేమీ సంబంధము? అని మీరు వదలిపెట్టిలే యెవరు ఆ రాక్షసబుద్దిలో వారికే పోయి వారినే చేరును. యెవరికి యేరకమైన బాధకలిగించాలి అని ఆశపడుదురో యేరకమైన బాధనందించాలి అని పన్నాగముచేయుదురో అవన్నీ వారికే రిసౌండ్ రియాక్షన్ రిప్లెక్షన్ రీతిగా వారిపైనేపడి వారికే కీడుచేయును; బాధనీయును.

భాగవతములోచూడండి; జరాసంధుడు కంసుడు, శిశుపాలుడు వీరందరికీ యేగతి దొరికినది! శిశుపాలుని తిరస్కారబుద్ధి ఆయనకే ముప్పుతెచ్చినది భగవంతుడు గుణాతీతుడు; మీమంచి

యే మీకు రక్షనిచ్చును: మీ చెడ్డనేమీకు శిక్షనిచ్చును. భగవంతునిలో అగ్రహములేదు, అనుగ్రహములేదు. అగ్రహ అనుగ్రహములు మీ మంచి చెడ్డయొక్క ప్రతిబింబములే!

భాగవతమున, పౌండ్రికుడు అనే ఒకాయన కృష్ణుని ఇమిటేట్ చేయుటకు తయారైనాడు. వాసుదేవుడు అని కృష్ణుని పేరును తనపేరుతో తగులించుకొని తన్నుపౌండ్రిక - వాసుదేవుడు అని ప్రచురించుకొన్నాడు! కృష్ణునికి సహజమైన శంఖ చక్రాలుంటే తానుచక్కతోచేయించి ధరించినాడు! కృష్ణుడు యేరీతిగా పీతాంబరమును ధరించునో తెలుసుకొని అట్లనే తానూకట్టుకొన్నాడు కృష్ణుడుయే హోదాతో యెట్లునడుచునో దానినే ఇమిటేట్ చేయుచూ వెళ్ళాడు? ఓహో! ఇతనే మేము వెతికే దేవుడని ఆ పిచ్చివానిని అనుసరించి వానివెనుక వెళ్లినమొఖాలుకూడ కొన్నిలేకపోలేదు, చివరకు ఆఇమిటేషన్ వాసుదేవునికి తన ఉన్మత్తచర్యనే అధఃపతనమునకు అంత్యమునకు సర్వనాశనమునకూ మూలకారణమయినది.

ఈ కలియుగములోకూడ ఇమిటేషన్లు అధికమైపోతున్నాయి! పౌండ్రికుడు వాసుదేవుడుగా మారినట్టుగా, ఇపుడు యిమిటేషన్ సత్యసాయిబాబాకూడా తయారైనాడు! నా గౌన్‌చూచి అదే నమూనాగౌను వేసుకొనేది, నాతలచూచి ఇట్లనే తనవెంట్రుకలనూ యెంతో కష్టపడి మార్చుకొనే ప్రియత్నమునకు పూనుకొనేది; నాఫొటోలుచూచి, అదేరీతిగా చెయ్ చూపించేది చేతులు

పెట్టుకొనేది, యెంతనీచమైన ప్రవర్తనలుచూడండి! అయితే, CREATION IS DIVINE; ఇవంత IMITATION IS HUMAN. ఇట్టి ఇమిటేషన్‌లకూ ఇదే పేరు పెట్టుకొని సత్యసాయిబాబాలుగా తయారౌదామన్న వ్యక్తులు పరమాత్మునిపై విశ్వాసమునే మూరముచేసే చీడపురుగులు; వీళ్లకు కొందరు భక్తులుకూడా గంతకుతగిన బొంతలుగా తయారై తమజీవితములను పాడుచేసుకొంటున్నారు. ఈ ఇమిటేషన్‌లు తానూచెడి వనమునూ చెడుపు కోతులవలె అని చెప్పటానికి యెంతైనా అవకాశమున్నది.

దైవము దైవము అని మీరు అటు ఇటు వారివెంట వీరి వెంట తిరుగనక్కరలేదు. దయగలహృదయమే దైవమందిరము గురువులకొరకు ప్రాకులాడనవసరములేదు. జగతిస్వరూపుడే ఆ సుందరస్వరూపుడు. Nature is the best preacher; Life is the best teacher. జగత్తేమీకు మంచి మార్గదర్శకుడు; జీవితమే మీకు ఉత్తమగురువు.

శ్రీవారి దివ్యబోధ బృందావనము 14-1-73



# "అట్లా అరవతు"

బాబావారి అనుగ్రహముగురించి విలువైన కధను మీకు చెప్తాను. బాబావారిని రుత్ అనే ఆమె భౌతిక చక్షువులతో చూడ లేదు. మొదట్లో బాబావారిమీద ఆమెకు అంతనమ్మకములేకపో యినా జాగ్రత్తలో శ్రీవారివిషయమును తెలుసుకుని విశ్వసించటం మొదలిడినది. మెక్సికోలో విద్యగరవువృత్తి అయినా శారీరక బాధలవల్ల ఆమె అమెరికాలోనే ఉండి వృత్తినిర్వహణకొరకు మెక్సికోకు వచ్చిపోతూ ఉండేది.

ఆమె సాంతాబార్బరులోఉన్న ప్రతిగురువారమూ భజనలకు హాజరగుచుండేది. మొత్తానికి బాబాను తన దైవముగా అంగీకరించినది.

ఆమె కీళ్ళరోగములతో బాధపడుచుండెడిది. రోగగ్ర స్తురాలైనప్పుడు వరుసగా కొద్దిరోజులపాటు తీవ్రమైన బాధను అనుభవించేది. ఒకనాడు ఆమె భరింపలేని బాధపడుచూ "అమ్మా! ఎవరైనా సహాయపడండి. ఎందుకింత బాధపడుచున్నాను? ఏమి చేయగలను? సహాయపడండి "అని ఏడ్చినది.

కొంతసేపు మొరపెట్టుకున్నాక; లోలోన కుమిలినది "ఎవరైనా రండి సహాయముచేయండి. ఎవ్వరూ రారా" అని ఆర్తనాదముతో రోదనచేసింది యెవరో దగ్గర వచ్చినట్టు........

ఆమె తిరిగి చూసింది. ఆమె ప్రక్క పరిక్కైన బాబావారు నిలబడియున్నారు.

"అట్లా అరవకు; నేనిక్కడే ఉన్నాగా" అని బాబావారు అతిమృదువుగా అన్నారు. బాబావారు అక్కడే ఉన్నారని తెలుసు కున్న తదుపరి ఆమె మనస్సు శాంతించినది. గాఢ నిద్రపట్టినది; మెలుకువ వచ్చేసరికి బాధమాయమైనది. .......................

దేశకాలముల కతీతులైనబాబావారు సర్వవ్యాపకులు.

సాంతాబార్బరా మిసెస్ మురియల్. జె. ఎంగెల్.
అమెరికా

# గీతోపదేశము

కస్త్వం, కోహం, కుత ఆయాతః — అనే మూడు ప్రశ్న లకు సమాధానము తెలియకుండా జీవన యాత్రను సాగించేటి మానవునికి అవమానకరము . నువ్వు యేవరు, యెక్కడనుంచి వచ్చావు, యెందుకువచ్చావు. అని అడిగిన, జవాబు ఇచ్చే స్థితిలో మానవుడు లేడు. ఒక వ్యక్తి బదరి యాత్రకొరకు బెంగుళూరి నుంచి బయలుదేరి డెల్లిలోని ఒక ఛత్రములో నిలిచిపోయి నాడనుకొండి; అక్కడివాళ్ళు అతనిని మీరెవరు, ఎందుకు డెల్లి వచ్చిరి ఎక్కడికి ప్రయాణము, ఏ పని మీద వచ్చిరి అని ప్రశ్నింతురు,

కదా ? అట్లనే ఈ కర్మక్షేత్ర యాత్రలో అక్కడక్కడ యెదు రయ్యే జనులు వేసే ప్రశ్నలకు జవాబు తెలియని మూర్ఖులుగా మానవులు తయారై పోవుచున్నారు.

దీనికి భగవద్గీతలో (11: 54) మూడు ముఖ్యమైన వుప దేశములను మూడు పదములలో కృష్ణపరమాత్ముడు అందించినాడు.
(1) జ్ఞాతుం: తానువేరు, జగత్తువేరు, బ్రహ్మమువేరు ; తాను దేహముకాదు. ఇంద్రియములు కావు, మనోబుద్ధులుకావు : అన్నిటియందూ నిండియున్న ఆత్మనే తాను, అని గురుముఖేన కానీ వివేక వైరాగ్య విచక్షణలవలనకానీ, శుద్ధ చిత్తములో ప్రతి బింబితమైన సుజ్ఞానమువలన కానీ తెలుసుకోవలెను.
(2) ద్రష్టుం : మంచి మామిడి పండ్లు మార్కెట్లో దొరకును. అనితెలిసుకొన్న, వచ్చే ఫలితమేమి ? దాన్నిదక్కించుకోవటానికి ప్రయత్నించి, వశము చేసుకోవలెను కదా ? (3) తరువాత, తత్త్వేన ప్రవేష్టుం : దాని ఆనంద రసమునసుభవించి దానితో యేకమై దానిలో లీనమైన, పూర్ణత్వమును పొందటము.

అపుడు ఆ బ్రహ్మవిత్, బ్రహ్మగా మారిపోతాడు . ఇదే ఆత్మసాక్షాత్కారము ; ప్రశాంతినుండి ప్రకాంతిని ప్రకాంతి నుంచి పరం జ్యోతిని పొందటము; మోక్షప్రాప్తి .

14-1-73 బాబావారి దివ్యబోధ

# పిల్లలభాగ్యము

బెంగళూరు నగరములోని శ్రీసత్యసాయి బాలవికాస్ తరగతుల బాల బాలికలు (సుమారు 750 మంది) భోగిపండుగనాడు, 'బృందావన''ములో భగవానుల దివ్యసన్నిధి చేరి, వివిధ మనోరంజకకార్యక్రమములద్వారా, వేలాది భక్తుల కమితానందము నందించి శ్రీవారి ఆశీస్సులనందుకొని కృతార్థులయిరి. శుభ్రవస్త్ర ధారులై పిల్లలు ఆనందోత్సాహముతో శ్రీవారికి ప్రదక్షిణ ప్రణామముగావించిరి. తరువాత, ఓంకారోచ్చారణ, నారాయణసూక్త పఠన, గీతాపఠన, నృత్యములు, సంభాషణలు, కోలాటములు ఉపన్యాసములు మొదలైనవాటిని క్రమశిక్షణలతో చక్కగా ప్రదర్శించిరి. 10, 12 వయస్సుగల పిల్లలు నామస్మరణ, గురుమహిమ, యక్షప్రశ్నలు ఈ విషయములను గురించి మనమోహకమైనరీతిన మధురశైలితో వారు ఉపన్యసించినపుడు అందరూ పులకితులైరి.

శ్రీ వారు పిల్లలనాశీర్వదించి, తమదివ్యబోధనందించిరి. ''భారతీయుల పెన్నిధులైన పరిశుద్ధ పవిత్రగ్రంథములైన శ్రీమద్రామాయణము మహాభారతము శ్రీమద్భాగవతము వీటిలోని దివ్య సూక్తులు బాల బాలికల నాలుకలపై యెంత త్వరగా నాట్యమాడునో సనాతన ధర్మోద్ధారణ కార్యము, అంత త్వరగా చేకూరును''

అన్నారు. "భారతదేశమందు యోగులు మహాత్ములు మహర్షులు ప్రబోధించిన ఆధ్యాత్మిక మార్గమందు బాలవికాస్ పిల్లలఅంతః కరణములను పవిత్రీకరించుటకు ప్రయత్నించవలెను" అని శ్రీవారు సంచాలకులను హెచ్చరించిరి. "నిర్మల హృదయులైన ఈ బాల బాలికలనే నిమిత్తములుగా పెట్టుకొని ధర్మోద్ధారణకార్యమును నెరవేర్చుట, నా సంకల్పము" అని శెలవిచ్చిరి.

దేహదాతలైన తల్లితండ్రులను, కృతజ్ఞతాపూర్వకముగా అనుసరించి ఆరాధించి ఆనందింపజేయవలెనని శ్రీవారుపిల్లలకు ఆదేశించిరి. నిత్యము వారికి నమస్కరించి, వారి ఆశీస్సులు పొందిన తరువాతనే ఇతర పనులలో ప్రవేశింపవలెనని బోధించిరి.

"రాజాజీనగరము, జయనగరము, శివాజీనగరము, మల్లేశ్వరము, దూరవాణీనగరము, విమాననగరములనుంచి మీరు గుంపులు గుంపులుగా స్వామి సన్నిధినాశించి యేరీతిగా బృందావనములో యేకమైరో, అట్లనే మి మీ అంతఃకిరణములు కూడ భగవద్దర్శనముకొరకు ఆవేదన పడుచూ, సత్యధర్మశాంతిప్రేమ పథమున యేకమై పోవలెను" అని ఆదేశించిరి. భ --భగవంతునిపై రత- రతిగలిగిన వాడే భారతీయుడు, అని విశదీకరించి, "మీ హృదయములు భారతీయముగా మారాలి ; మీ ఆలోచనలు భావములుమీ వేష భాషలు సమస్తమూ భారతీయముకావాలి"అని ప్రబోధించిరి "ధర్మరాజువలె, సదా ధర్మదృష్టితో మెలగండి - పరమాత్ముని

పవిత్ర నామమును సదా స్మరణ చేసుకొని, అపవిత్రచింతలను దూరము గావించండి.

దేహము ఒక కెమెరా; దానిలోని మనస్సే లెన్స్; హృదయమే ప్లేట్; బుద్ధి, చీకటిని ఛేదించు ఫ్లాష్; చిత్తమే, ఆ కెమేరా స్విచ్. ఇట్టి విలువైన పవిత్రమైన కెమెరాను పరమాత్మనిపై త్రిప్పి, సరిగా ఫోకస్ చెసి, క్లిక్ చేసిన, ఆయన, హృదయమున చక్కగా పడి అక్కడే వారి ప్రతిబింబము నిలిచిపోవును," అని శ్రీవారు శెలవిచ్చిరి. నమస్కారము నందించి పుష్పమాలలను సమర్పించే భాగ్యమును బాల బాలికలందరికీ అనుగ్రహించిరి.

సం





చిమ్మ చీకటుల్ జగమెల్ల గ్రమ్మినట్లు
ఆత్మలోపల నజ్ఞానమాక్రమించె
దెన్నుగానక ఎడయాడుచున్నవాడ
వెలుగుజాడల జూపుమో సాయిదేవ !

బ్రతికినన్నాళ్ల తలవంపు రానియట్టి
సకల ధర్మార్థకామమోక్షముల గాంచి
తుదకు నిన్జేరి నీలోన బొదలనట్టి
వెలుగుజాడల జూపుమో సాయిదేవ .



# పుస్తక సూచి

1 పుస్తకముల వెలనూ పోస్టు మరియు రిజిస్ట్రేషను చార్జీలను మని యార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 నిలువలోనున్న పుస్తకములు వాటి పోష్టు చార్జీలు క్రింద తెలియ జేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్ పోష్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోష్టుచార్జీ మరియు ప్రతి ఆర్డరుతోనూ రిజిస్ట్రేషను చార్జీ రూ. 1-05 పై జతపరచి, కావలిసిన పుస్తకములను వివరముగా వ్రాసి పంపవలెను.

| | పేరు | వెల | టపాలచార్జీ |
|---|---|---|---|
| తెలుగు:—— | | | |
| 1. | సత్యంశివం సుందరం(1) | 4-00 | 0-40 |
| 2. | .. .. (2) | 4-00 | 0-45 |
| 3. | మణిమాల | 1-00 | 0-55 |
| 4. | భాగవత వాహిని | 4-00 | 0-21 |
| 5. | అర్పణ | 1-00 | 0-10 |
| 6. | సాయిరామ నామమహిమ | [illegible]-00 | 0-10 |
| 7. | సందేహ నివారిణి | [illegible]-[illegible]0 | 0-20 |
| 8. | గీతా వాహిని | 4-00 | 0-40 |
| 9. | వచనామృతము | 4-00 | 0-30 |
| 10. | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 11. | గీతాభావ ప్రకాశము | 15-00 | 1-00 |
| 12. | బోధామృతము | 0-50 | 1-00 |

| | | | |
|---|---|---|---|
| 13. | దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |
| 14. | స్తుతి తరంగిణి (2వ భా) | 0-50 | 0-10 |
| 15. | దివ్యజ్ఞానదీపికలు | 0-75 | 0-20 |

కన్నడం:——

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యం శివం సుందరం | 3-50 | [illegible]-30 |
| 2. | జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 3. | ప్రశాంతి వాహిని | 1-50 | 0-10 |
| 4. | సందేహ నివారిణి | 1-50 | 0-10 |
| 5. | ధర్మ వాహిని | 1-50 | 0-10 |
| 6. | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 7. | ధ్యాన వాహిని | 1-50 | 0-10 |
| 8 | ప్రశ్నోత్తర వాహిని | 1-00 | 0-15 |
| 9. | గీతావాహిని | 4-00 | 0-25 |

మలయాళము:——

| | | | |
|---|---|---|---|
| 1. | జ్ఞానోపదేశరత్నంగళ్ | 1-50 | 0-20 |
| 2. | 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3. | గీతావాహిని | 3-00 | 0-15 |
| 4. | అవతారమాహాత్మ్యం | 0-50 | 0-15 |
| 5. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 6. | అవతార మధురవాక్య | 2-00 | 0-20 |
| 7. | వాచోరత్నంగళ్ | 3-00 | 0 30 |
| 8. | ధర్మ వాహిని | 1-00 | 0-10 |

ఇంగ్లీషు - -

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యసాయి స్పీక్స్ (2భా) | 4-0 | 0 30 |

| | | | |
|---|---|---|---|
| 2. | సత్యసాయి స్పీక్స్ (3భా) | 4-00 | 0-30 |
| 3. | ,, .. (4భా) | 5-00 | 0-40 |
| 4. | .. .. (5భా) | 5-00 | 0-40 |
| 5. | సాయిబాబ (అమేరికన్ ఎడిషన్) సత్యం శివం సుందరం (1వభా) | 6-00 | 0-30 |
| 6. | ప్రశాంతి వాహిని | 2-00 | 0-15 |
| 7. | ప్రేమ వాహిని | 2-00 | 0-15 |
| | ఉపనిషత్ వాహిని | 2-00 | 0-15 |
| 9. | గీతా వాహిని | 4-00 | 0-35 |
| 10. | జ్ఞాన వాహిని | 2-00 | 0-15 |
| 11. | భాగవతవాహిని | 5-00 | 0-40 |
| 12. | భజన్ సాంగ్స్ | 2-00 | 0-20 |
| 13. | ధ్యానవాహిని | 2-00 | 0-15 |

అరవం:——

| | | | |
|---|---|---|---|
| 1. | భగవాన్ శ్రీ సత్యసాయిబాబా అరుళ్ వాక్కు | 2-00 | 0-15 |
| 2. | అన్బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 3. | సత్యం శివం సుందరం (1వ భా) | 3-50 | 0-40 |
| 4. | .. .. .. (2వ భా) | 4-00 | 0-30 |
| | భజనావళి | 1-00 | 0-15 |
| 6. | అవతారమొళిఅముదం (1వ భా) | 3-00 | 0-30 |
| 7. | ,, ,, (2వ భా) | 3-00 | 0-35 |
| 8 | సాయిమాత | 1-00 | 0-10 |

| | | | |
|---|---|---|---|
| 9. | ధర్మ వాహిని | 1-50 | 0-10 |
| 10. | సందేహనివారిణి | 2-00 | 0-25 |
| 11. | జ్ఞానవాహిని | 1-50 | 0-20 |

**హిందీ:——**

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యసాయీశ్వరాయనమః (పద్యములు) | 1-0 | 0-10 |

**బెంగాలి:-**

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యం శివం సుందరం | 4-00 | 0-35 |
| 2. | సందేహ నివారిని | 2-50 | 0-30 |

**గుజరాతి:——**

| | | | |
|---|---|---|---|
| 1. | అమృత్ వాహిని | 2-00 | 0-20 |
| 2. | కథాసుధ | 2-00 | 0-15 |
| 3. | ధర్మ వాహిని | 1-50 | --20 |
| 4. | సత్యం శివం సుందరం | 4-00 | 0-35 |

**సింధి:—**

| | | | |
|---|---|---|---|
| 1. | భజనావళి | 0-50 | 0-10 |
| 2. | ధ్యానవాహిని | 1-00 | 0-15 |

**మేనేజర్, సనాతన సారథి.**



1. ప్రశాంతినిలయమునుండి తెలుగు మరియు ఇంగ్లీషు భాషలలో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా : 4రు॥ ఒక సంవత్సరము నకు తక్కువకాని 5 సం॥ల కెక్కువకాని చందాలు స్వీకరింపబడవు.

2. చందాలనుపంపించునపుడే ఈక్రింది వివరములను సుస్పష్టముగా తెల్పవలెను.

ఎ) మొదటిసారిగా చందాలను పంపేవారు "క్రొత్తచందాదారు", అని వ్రాయవలెను.

బి) ప్రస్తుతచందా గడువు పొడుగించుటకు, తనచందానెంబరునుచందాపంపించు సమయమునందే తెలియజేయవలెను.

సి) తెలుగు పత్రిక కావలెనో లేక ఇంగ్లీషుపత్రిక కావలెనో స్పష్టముగావ్రాయవలెను.

డి)చందాదారు తన పేరును పూర్తివిలాసమును స్పష్టముగా తెలియునట్లు వ్రాయవలెను. M.O. ద్వారా చందానుపంపించువారు వారిపేరును పూర్తి విలాసమును M.O. కూపను వెనుకభాగమున వ్రాయుట అత్యావశ్యకము.

3. పత్రికలుగాని పుస్తకములుగాని V. P.P. ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు వాటివివరములను పైకముతోపాటుగా తెలియపరచవలెను. M.O. ద్వారా పైకమును పంపించువారు కూపనులోనేకావలసినపుస్తకముల వివరములను తెలియజేయవలెను.)

4. పత్రికకుగాని పుస్తకములకుగాని పైకమును పంపించువారు తమచెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ఆర్డర్లను, మనియార్డర్లను. "సనాతన సారథి", ప్రశాంతినిలయం పోస్టు. అనంతపురంజిల్లా, ఆంధ్రప్రదేశ్, అను చిరునామాకు పంపవలెను. చెక్కులు పంపేవారు బ్యాంకిఖర్చులనుకూడా కలిపి, మొత్తమును పంపవలెను. పత్రికగాని, లేక, పుస్తకములుగాని చెక్కుపైకము వసూలైన తరువాతనే పంపించబడును.

5. పైవిషయములకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతనసారథి, ప్రశాంతినిలయంపోష్టు, అనంతపురంజిల్లా. ఆంధ్రప్రదేశ్ అనుచిరునామాకు వ్రాయవలెను. అట్లువ్రాయు ఉత్తరప్రత్యుత్తరములలో తమచందానెంబరును లేక బుక్ ఆర్డరునెంబరును, తప్పక వ్రాయవలెను, అట్లు వ్రాయనియెడల జవాబిచ్చుటకు ఆలస్యమగును.

6. పోస్టుద్వారా ఫొటోలు పంపబడవు.

---

ఆంధ్రప్రదేశ్ అనంతపురంజిల్లా ప్రశాంతినిలయము నందలి శ్రీ సత్యసాయి ముద్రణాలయమునందు యన్. కస్తూరి గారిచే ముద్రింపబడి బి.వి.రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి ట్రస్ట్ తరఫున ప్రచురింపబడినది. ఎడిటర్, యన్. కస్తూరి ఎం. ఏ., బి. యల్.